# నేను లొంగిపోలేదు

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి



# Hiroo Onoda

**- Born 1922 died on 2014 at age 91  in tokyo japan**



Hiroo onoda in his old age in japan

నేను లొంగి పోలేదు - **28 -03 -25 ono1**

మనలోని ప్రతి ఒక్కరికీ తెలిసిన యుద్ధము రెండో ప్రపంచ యుద్ధము . నాజీ జర్మనీకి చెందిన అడాల్ఫ్ హిట్లర్ జర్మనీ పాలన కింద వుండే భూభాగాన్నీ విస్తరించి - జెర్మనీని ప్రపంచపు అగ్రదేశముగా చేయదలుచుకున్నాడు . అప్పటికి వున్న భూభాగ రీత్యా రష్యా ప్రపంచపు అతి పెద్ద దేశము . జెర్మనీ - పోలాండ్ మీదుగా రష్యా వైపుగా విస్తరించుకుంటూ వచ్చి - భూభాగరీత్యా ప్రపంచపు అగ్రదేశంగా మారే ఆలోచనలో వున్నదని రష్యా భావించింది .

పోలండుకు జర్మనీ కి మధ్య వున్న భూ మార్గపు దూరము 559 km . పోలండుకు రష్యాకి మధ్య వున్న భూమార్గపు దూరము 4,961 km లు . 23-24 August 1939, రష్యా మరియూ జెర్మనీ మధ్య న ఒక అవగాహనా ఒప్పందం జరిగింది . దీనిని Molotov-Ribbentrop Pact. అంటారు . దీని ప్రకారం జర్మనీ నుండి రష్యా వైపుకు విస్తరించివున్న వున్న భూభాగాల కోసము అని ఈ రెండు దేశాలూ పోట్లాడుకోవు . సమాన హక్కులు పంచుకుంటాయి . ఇట్లగా పోలాండ్ దేశము రష్యా జర్మనీల మధ్య చెరి సమంగా

విభజింప బడింది.   కానీ నాజీ  జర్మనీ , కి నాయకుడైన  అడాల్ఫ్  హిట్లర్ ,  1 సెప్టెంబర్  1939,  పోలాండ్ మీద దాడి చేసాడు. హిట్లర్  తన ఒప్పందాన్ని తానే ఉల్లంఘించిన ఈ  తేదీని   రెండో ప్రపంచ యుద్ధము ప్రారంభము ఐన తేదీగా లెక్కిస్తారు .

ఈ పోలండు యుద్ధము జరిగే వరకూ -  రవి అస్తమించని సామ్రాజ్యము కల ఇంగ్లాండ్ వారే ప్రపంచ అగ్రదేశము గా వున్నారు  .  జెర్మనీ పోలాండ్ పై దాడి చేయటంతో - తమ సామ్రాజ్యానికి పోటీగా మరొక క్రొత్తసామ్రాజ్యము ఎరపడుతున్నదని భావించిన -   యునైటెడ్  కింగ్డమ్-  పోలాండ్ మీదకు వెళ్లిన జర్మనీ పై యుద్ధాన్ని ప్రకటించింది  .   ఫ్రాన్స్ దేశము   యునైటెడ్  కింగ్డమ్ తో జట్టు కట్టింది .  కారణం ?  ఫ్రాన్స్  కి   స్పెయిన్ దేశముతో  సహజ  శత్రుత్వాలు వున్నాయి. ఈ రెండో ప్రపంచ యుద్దకాలము ల    స్పెయిన్ తాను  తటస్థ దేశంగా వున్నాను అని చెప్పుకునేది  . కానీ దొంగ చాటుగా జర్మనీకి మద్దతు ఇస్తూ ఉండేది . ఇంగ్లాండ్ - జర్మనీ మీద శత్రుత్వము వహిస్తున్నది .అలాంటి జెర్మనీకు స్పెయిన్ సహాయము అందిస్తున్నది .  ఫ్రాన్స్ - స్పెయిన్ లు శత్రువులు కదా ? . అందువల్ల  ఫ్రాన్స్ - తాను  యునైటెడ్  కింగ్డమ్ తో జత కట్టటం ద్వారా - స్పెయిన్ మీద తనకు గల శత్రుత్వానికి ఒక యుద్ధ రూపము ఇవ్వతలిచింది .  ఇంగ్లాండ్ మరియూ ఫ్రాన్స్ దేశాలు కలిసి   స్పెయిన్ - ను తమ ఉమ్మడి శత్రువుకింద లెక్క వేశారు .ఇహ  స్పెయిన్ ఏమీ తక్కువ దేశము ఏమీ  కాదు .

"రోడ్డు మీద పడిన కాయిన్ ని ముందుగా ఎవరు చూస్తే అది వారిదే "అనే సామజిక న్యాయం ఆనాటి ప్రపంచం అంతా చెల్లుబాటు అవుతూ ఉండేది . సముద్రములో చెల్లా చెదురుగా ఏర్పడి వున్న ద్వీపాలు బంగారు నాణేలు అనుకుంటే -  " దాన్ని ముందుగా ఎవరు చూస్తే అది వారిదే" అన్న సామజిక న్యాయం ఈ సముద్రపు ద్వీపాలకు కూడా వర్తిస్తూ ఉండేది  .  క్రిస్టోఫర్  కొలంబస్ 1492  లో "నేనొక దీవిని కనుగున్నాను కాబట్టి  అది మనది" -  అని స్పెయిన్ రాజుకు చెప్పాడు . అది కరీబియన్ సముద్రములో వున్న క్యూబా  అనే

ఐలాండ్ దేశము. స్పెయిన్ 1511 నాటికి ఈ క్యూబాదీవి లో - తన రాజ్యమును ఏర్పరిచింది .

ఇహ "ఫెర్డినాండ్ మాగెల్లాన్ " అనే ఇంకొకాయన " అదిగో అక్కడ ఒక ద్వీపము ఉంది . అందరికన్నా ముందు నేను కనిపెట్టాను " అని స్పెయిన్ రాజుగారికి చెప్పాడు . అప్పుడు రాజుగారు " అయితే అది కూడా మనదే ను - పద " అంటూ ఆ దీవి కి మొదటిగా తన వ్యాపారులను పంపి - 1565 లో మనీలా రాజధానిగా ఫిలిప్పీన్సులో స్పెయిను పాలనను స్థాపించాడు. ఇలాగ్గా , ఫిలిప్పీన్స్ అనే ద్వీప దేశము , దానితో పాటుగా ఇతర చిన్న ద్వీపాలు స్పెయిన్ పాలన కిందకు వచ్చాయి . ఇప్పుడు స్పెయిన్ పాలన కింద ఫిలిప్పీన్స్ మరియూ క్యూబా దేశాలు వున్నాయి . ఈ ఫిలిప్పీన్స్ 1565 నుండీ 1898 వరకూ అంటే 333 ఏండ్ల పాటు స్పెయిన్ వారి పాలనలో ఉంది .ఇక రొండో ప్రపంచ యుద్ధ కాలము నాటికి ఈ ఫిలిప్పీన్స్ దేశాని కి - భూగోళములో అది వున్న చోటుని బట్టి ఎంతో యుద్ధ ప్రాముఖ్యత దక్కింది .

క్యూబా ప్రజలు స్పెయిను నుండి తమకు స్వాతంత్రం కావాలని ఉద్యమించారు .వారికి స్వాతంత్రము ఇప్పించే పనిని అమెరికా నెత్తికెత్తుకుంది . 1898 లో క్యూబా ఉద్యమ కారులకు మద్దతుగా - అమెరికా తన యుద్ధ నౌకలను - క్యూబాలోని హవానా హార్బర్ కి పంపింది. ఈ నౌక లలో ఒకటి దానిలో ఉన్న మందుగుండుతో సహా తగలబడి పోయింది . ఈ పని చేసింది స్పెయిన్ దేశమే అని నమ్మిన అమెరికా స్పెయిన్ దేశముపై యుద్ధానికి దిగింది .ఆ యుద్ధము April 1898 నుండీ July 1898 మధ్య జరిగింది .

యుద్ధము లో . స్పెయిన్ "క్యూబా" ని వదులుకొంది . దానితో క్యూబా స్వతంత్ర దేశము అయ్యింది . కానీ అమెరికా ఇదే అవకాశం అన్నట్లు - తన విజయానికి గుర్తుగా లేదా బహుమతిగా అన్నట్లు -ఫిలిప్పీన్స్ లోని " Puerto రికో" అనే దీవిని - "Guam " అనే దీవిని తన స్వాధీనం లోకి తీసుకొని - క్రమంగా ఫిలిప్పీన్స్ లోకి తన అధికారాన్ని ప్రవేశపెట్టింది . అమెరికా చేసే ఈ పనులను " ది ఇంపీరియలిస్ట్ పాలసీ " అంటారు . ఈ పాలసీ క్రింద అమెరికా

తన  మిలటరీని లేదా ఆర్థిక శక్తిని లేదా అమెరికన్ కల్చర్ ని వాడి వేరే దేశాల మీద తన అధికారాన్ని లేదా పెత్తనాన్ని ప్రవేశపెట్టుకుంటూ ఉంటుంది. అమెరికా క్రమంగా   ఫిలిప్పీన్స్ లో తన అమెరికన్  కల్చర్ను ప్రవేశపెట్టుకొని - ఆ ప్రజలను తనవైపు తిప్పుకొని ఆదేశాన్ని తన సొంతం చేసుకుంది  . ఇట్లాగా ఫిలిప్పీన్స్ అనేది  అమెరికా వారిది  ఐంది. ఇప్పటి వరకూ  అతి పెద్ద భూభాగాన్ని  కలిగి వున్న  దేశము రష్యా మాత్రమే. అదే అగ్రరాజ్యము   . ఫిలిప్పీన్స్   దీవులను కలుపుకున్నాక    అమెరికా పాలన కింద వున్న  భూభాగము యొక్క విస్తీర్ణము పెరిగి .అది  రష్యాకు సమము అయ్యింది . ఇప్పుడు రెండు ప్రపంచ అగ్రరాజ్యాలు ఏర్పడ్డాయి .

ఫిలిప్పీన్స్ ప్రజలు మాత్రం అమెరికా నుండి   స్వతంత్రం కోరు కొక పోరు   కదా ? అందు వల్ల ఫిలిప్పీన్స్ గొరిల్లాలు అనే వారు బయలు దేరి -స్వతంత్ర ఫిలిప్పీన్స్ కోసం పోరాటం చేశారు . వీరి చికాకు వల్ల అమెరికా ఫిలిప్పీన్స్ పై తన పట్టును క్రమంగా  వదిలివేస్తూ వచ్చింది .1902  నాటికి ఆ పట్టును  పూర్తిగా వదిలి వేసింది .అయినా కానీ కొద్దో గొప్పో అమెరికన్ సైన్యము ఫిలిప్పీన్సు లో ఉంటూనే ఉండేది .
1902  నాటికి అమెరికా వారు వదిలివేసిన  ఈ ఫిలిప్పీన్స్ దేశము యుద్ధ వ్యూహాల  రీత్యా జపాన్ దేశానికీ  కూడా ఎంతో అవసర మైన  భూ భాగము గా మారింది  . అందువలన జపాను దేశము   డిసెంబర్  8, 1941 ఫిలిప్పీన్స్ ను ఆక్రమించి -    - 1945  లో తాము  అమెరికాకి లొంగి పోయే వరకూ ఫిలిప్పీన్స్ దేశము ను  పాలించారు .

కొద్దిమంది  అమెరికన్ సైనికులు ఇంకా అక్కడ ఉండగానే --  ఫిలిప్పీన్ దీవులను జపాను తన రాజ్యము గా చేసుకుంది కదా ? అందువలన ఫిలిప్పీన్స్ కు స్వాతంత్రము పోవటం అనేది అమెరికా అసమర్ధతగా లెక్క వేయబడి - ఫిలిప్పీన్స్ కు  స్వాతంత్రము ఇప్పించ వలసిన  భాధ్యత అమెరికా పై పడ్డది . ఏది ఏమైనా   1943  లో ఒకసారి జపాన్ ఫిలిప్పీన్స్ కు స్వాతంత్రము ఇవ్వ చూపి "అమెరికా వచ్చి మీకు స్వాతంత్రము ఇచ్చేబదులు మేమే మీకు స్వాతంత్రము ఇస్తాము - మీరు రెండో ప్రపంచ యుద్ధములో మాతో కల్సి పని

చేయండి" అని ఫిలిప్పీన్స్ గెరిల్లాలు ను కోరింది . కానీ వారు ఈ స్వాతంత్ర్యాన్ని తీసుకోవటానికి తిరస్కరించి అమెరికా పక్షం నిలబడి యుద్ధము చేయటానికి సిద్ధ బడ్డారు . స్వాతంత్రము అన్నది ఒకరి ఇస్తే పుచ్చుకోవల్సిన బిక్ష కాదు - అది పోరాడి సాధించుకోవలసినది - అప్పుడే దాని విలువ " అన్న ఆలోచన ప్రకారం ఫిలిప్పీన్స్ గెరిల్లాలుఅట్లా చేశారు .
జపాను 1941 ఫిలిప్పీన్స్ ను ఆక్రమించింది .1943 లో ఒకసారి జపాన్ ఫిలిప్పీన్స్ కు స్వాతంత్రము ఇవ్వ చూపింది . కానీ ఇప్పటికే రెండో ప్రపంచ యుద్ధము త్రీవ్ర రూపము దాలుస్తూ వున్నది . ప్రపంచం అంతటా పాకుతున్నది .

రెండో ప్రపంచ యుద్ధ సందర్భంగా అమెరికా-- జపాను మీద ప్రయోగించే యుద్ధ విమానాలను అడ్డుకొని - అమెరికాని అదుపుపులో పెట్టటం కోసం అని - జపాను ఫిలిప్పీన్స్ పై మరలా పట్టు పెంచింది. ఫిలిప్పీన్స్ అలాగే జపాను వారి చేతిలో ఉంటే అది అమెరికాకు ముప్పు అని భావించిన అమెరికా కూడా మరల ఫిలిప్పీన్స్ పై ఫోకస్ పెట్టింది . ఇప్పుడు అమెరికాకి ఈ ఫిలిప్పీన్ గొరిల్లాలు అండగా నిలిచారు. ఈ గొరిల్లాలు తమకు చేసిన సాయానికి బదులుగా ఫిలిప్పీన్స్ కి స్వాతంత్రము ఇప్పించ వలసిన భాద్యత అమ్రికా నెత్తిన పడింది . ఇట్లాగా ఫిలిప్పీన్స్ విషయములో అమెరికా మరియూ జపానులు బద్ధ సెత్రువులు గా తయారు అయ్యాయి

రెండో ప్రపంచ యుద్ధము లో గెలిచిన వారికి ఎన్నో లాభాలు ఉంటాయి అని భావించిన ప్రపంచ దేశాలు -- . ఆ లాభము కోసం అని - గెలుపు సాధించగలరు అనుకున్న వారి వారి పక్షాన నిలబడ్డారు . అట్లాగా అది ప్రపంచ దేశాల యుద్ధము గా మారింది .

రెండో ప్రపంచ యుద్ధ - యుద్ధ రీత్యా తనకు ఎంతో అవసరమున్న ఫిలిప్పీన్స్ దేశం లో ని అమెరికన్ లను తొలగించి అక్కడ తన పట్టు ఏర్పరిచేందుకు అని, జపాన్ దేశము కొంత అదనపు సేనలను ఫిలిప్పీన్స్ పంపింది .

ఇలా వెళ్లిన సైనికులలో "హిరూ ఓనోడా" అనే జాపనీస్ మిలిటరీ సైనికుడు ఒకడు . ఇతడు నేటి జాపనీస్ ప్రజలకు హీరో . "నేను లొంగిపోలేదు" అనే పేరిట ఇతని కథ ప్రపంచ ప్రసిద్ధము. . ఇతని పై సినిమాలు- టీవీ కథనాలు అనేకం వచ్చాయి . ఇకముందు మనము ఇతని కథ ను తెలుసుకో బోతూ వున్నాము .

నేను లొంగి పోలేదు **02-04 -25 ono2**

"రెండో ప్రపంచయుద్ధములో - September 02 - 1945 న - జపాను దేశము అమెరికాకు లొంగి పోయింది . "నా జపాను ఒకరికి లొంగి పోవటమా ? " అనే దేశభక్తితో -మన "హిరూ ఓనోడా" "జపాను అమెరికాకి లొంగి పోయింది" అనే వార్తను నమ్మ టానికి తిరస్కరించాడు - జపనీయుల జాతి స్వభావము ప్రకారము యుద్ధము అంటే వెళ్లి గెలిచి రావటం లేదా చచ్చి పైలోకాలకు వెళ్లి పోవటం మాత్రమే .ఈ రాక పోకల మధ్యన " లొంగిపోవటం " అనే మజిలీ ఏ లేదు .అందువల్ల ఈ లొంగుబాటు అనేది ఓ గాలి వార్త అని నమ్మాడు . - అందువల్ల జపాను అమెరికాకి లొంగి పోయిన తరువాత కూడా దాదాపు 29 ఏండ్ల పాటు "యుద్ధము జరుగుతూనే వున్నది" అనుకుంటూ ఫిలిప్పీన్సు దేశపు అరణ్యాలలో గడిపాడు . ఆలా గడుపుతూ -తన శత్రువైన అమెరికా మీద తాను చేయగల పోరాటాన్ని చేస్తూ వచ్చాడు . ఇకముందు ఈ సంగతులు వివరంగా .

"హిరూ" అన్నది మనిషి పేరు ." ఓనోడా" అంటే పెరటి తోటగా వరి మొక్కలను పెంచే ఇంటి వారు అని. ఈ నేపధ్యము ఇతడు ఎంతో పేదవాడు అని తెలియ పరుస్తుంది . మనము ."హీరో హోండా" అని పలికే బండి పేరును "హిరూ" హోండా" అని పలక వలసి వున్నదని నేను అనుకుంటాను . "హిరూ" అంటే మనిషి పేరు . హోండా అనగా వరిపొలాలు కలిగిన భూస్వామి అని .
రెండో ప్రపంచ యుద్ధ సందర్భంగా - యుద్ధములో పాల్గొనే సైనికులు ఎక్కువగా కావాల్సి వచ్చి న - జపాను దేశము తన మిలిటరీ లో చేరటానికి అర్హమైన వయస్సు మొగవారికి 15 నుండి 60 అని ఆడవారికి 17 నుండి – 40 అని

నిర్ధారించింది . ఈ నిర్ధారణ ను బట్టి - ఈ వయసు పరిమితికి లోబడిన వారంతా తప్పని సరిగా మిలటరీలో చేరి తీరాలి అని చట్టము చేశారు .
మన "హిరూ"ఓనోడా 19 March 1922 – న పుట్టాడు .1942 లో అంటే తన 20 యేండ్ల వయస్సులో జాపనీస్ మిలిటరీ లో చేరాడు. ఇలా వయసు మూలంగా -- తప్పని సరిగా సైనికులు కావాల్సి వచ్చిన సైనికులను కాంస్క్రిప్టెడ్ {conscripted } సైనికులు అంటారు . వీరితో ఏర్పరిన ఆర్మీ కి "కాంస్క్రిప్టెడ్ మిలిటరీ" అని పేరు . తప్పని సరిగా సైనికునిగా మారిన వారు - తాము తమ కుటుంబమును వీడి పోవాల్సి వచ్చిందే అని దుఃఖ పడటం సహజం. తమ శత్రు దేశమే తమకు ఈ గతి తెప్పించింది అని కూడా వీరు అనుకోవటం కూడా సహజమే .. అందువలన వీరు తమ దేశభక్తి కి శత్రువుమీద తమకు గల వ్యక్తి గత ద్వేషాన్ని కూడా కల కలిపి త్రీవ్రంగా యుద్ధం చేస్తారు . అందువల్ల ఇలాంటి సైనిక దళాన్ని అన్ని దేశాల మిలటరీలు ప్రోత్సహిస్తాయి . ఆనాడు జపానులో వున్న 15 నుండి 60 వయస్సు వారంతా మిలటరీ లోకి పోవటం వల్ల జపానులో పుట్టే బుడంకాయల సంఖ్యా బాగా తగ్గి పోయింది. . జపాను ప్రజలు "వాళ్ళ ఆమెలేట్ కోసం నేను గుడ్డు పెట్టటం ఎందుకు ?" అని కోడి అనుకున్నట్లు - మనమూ అనుకోవాలి - 15 ఎండ్లకే సైన్యములో చేర వలసిన పిల్లలని కనటం ఎందుకు?" అని అలోచించి అప్పటినుండి పిల్లల్ని కనటం మానివేయడం అనే మనస్తత్వాన్ని అలవర్చుకున్నారు . రెండో ప్రపంచ యద్ధ కారణం గా జపాను కు కి ఏర్పడిన త్రీవ్ర నష్టాల్లో - జనాభా వృద్ధి రేటు తగ్గు మొఖం పట్టటం కూడా అతి ముఖ్యమైనది . ఇప్పుడు జపాను ఆర్మీ లో చేరాల్సిన వయసు 18 . అదికూడా ఇష్టమున్న వారే చేరవచ్చు నిర్బంధము ఏమీ లేదు . అయినా గానీ "పిల్లల్ని కనటం మానుకోవాలి" అనే ప్రజల మనస్తత్వాల్లో మాత్రం మార్పు రాలేదు . వారు దానికి అలవాటు పడి అందులోనే సుఖాన్ని / లాభాన్ని వెతుక్కున్నారు .

"హిరూ"ఓనోడా 20 యేండ్ల వయస్సులో "కాంస్క్రిప్టెడ్ " సైనికునిగా ఆర్మీ లోకి వెళ్ళాడు . అతనికి ఉన్న తెలివిని అంచనా వేసి న అధి కారులు - ఇతనికి "మిలిటరీ ఇంటిలిజెన్స్ ఆఫీసర్- గెరిల్లా ఆపరేషన్స్" అనే పదవి ఇచ్చి అందుకు

తగ్గ ప్రత్యేక శిక్షణ కూడా ఇచ్చి , డ్యూటీ కి  పంపారు . ఈ  పదవిలో వున్నవారు - ప్రపంచములోని ఏ దేశము నుండి అయినా జపానుకు రాగాల ముప్పును ముందుగా అంచనా వేసి ఓ నివేదిక ఇవ్వాలి . ఈ డ్యూటీ మీద   హీరో  ఓనోడా ఫిలిప్పీన్స్ కు చెందిన "లుబంగ్" అనే దీవికి పంపబడ్డాడు . ఈ ఫిలిప్పీన్స్ లో ఎదో కొద్దిగా అమెరికన్ సైన్యము వున్నది . వీరు  ఫిలిప్పీన్స్ గెరిల్లాల తో పాటుగా అరణ్యాలలో దాక్కుని ఉంటూ - వారి  సాయంతో మనుగడ సాగిస్తూ - ఫిలిప్పీన్స్ భూభాగాల  నుండి జపాను భూభాగము మీదకు వైమానిక దాడులు చేస్తూ వుండే వారు  .

డిసెంబర్  8, 1941 నుండి 1945  లో , జపాను,  అమెరికా వారి చేతిలో ఓడిపోయే వరకూ ఫిలిప్పీన్స్ దేశము జపాను వారి అధీనం లో వుంది . అందువల్ల ఓనోడా ని అక్కడికి పంపారు . 1939 లో యుద్ధము మొదలైంది . 1941  లో జపాను   ఫిలిప్పీన్స్ ను చేజిక్కించుకుంది . ఈ స్వల్ప వ్యవధి కారంముగా ఫిలిప్పీన్స్ దేశము లో ఏ మూల ఏమి ఉందొ జపానుకు పూర్తిగా తెలియదు .    కొత్తగా మిలటరీలో చేరిన ఓనోడా--  కొత్తగా జపాను స్వాధీనము చేసుకున్న ద్వీపం లోకి పంప పడ్డాడు.   జపాను పట్ల  ఫిలిప్పీన్స్ ప్రజలు ద్వేషము కలిగి వుంటారు  అనటం లో ఎటువంటి సందేహమూ  లేదు. అందువల్ల  జపాను దేశానికి  సరి ఐన వివరాలు తెలియని  ప్రాంతం లోకి - జపాన్ దేశాన్ని పచ్చి శత్రువులుగా చూసే ప్రజల మధ్యకు ఓనోడా పంపబడినట్లు అయ్యింది . ఇట్లా చూచినపుడు -  జపానుమిలిటరీ  అత్యంత ప్రముఖము  ఇచ్చే  భూభాగానికి కి ఓనోడా పంపబడ్డాడు అని కూడా చెప్పవచ్చు .

జపాను వారు  ఫిలిప్పీన్స్  ను ఆక్రమించటానికి ముందు-అది ఉండీ లేనట్లు వున్న అమెరికా సైనికులు -  వారి పెత్తనం కింద ఉంటూ వున్న స్వాతంత్ర దేశము  . ఫిలిప్పీన్స్ లో  అమెరికా సైన్యము నామమాత్రంగా ఉండటం వల్ల , జపాను  ఫిలిప్పీన్స్ ను స్వాధీనం చేసుకో గలిగింది   .   ఆలా చేసుకున్నప్పుడు --  జపాను దేశము తనకు దొరికిన 78,000 అమెరికన్  అండ్  ఫిలిపినో సైనికులను  - కల గలిపి-  వారి చేత  ఒక మిలిటరీ మార్చ్ చేయించింది . ఈ

మార్చ్ ని "ది బటాన్ డెత్ మార్చ్" అంటారు . ఇది ఫిలిప్పీన్స్ లోని బటాన్ అనే ప్రాంతము నుండి మొదలై 105 కిలోమీటర్స్ ఆవల వున్న మరో ప్రాంతము వరకూ జరిగింది . ఈ దూరం నడవలేక 5,000 నుండి 18,000 ఫిలిపినో సైనికులూ 500 నుండి 650 అమెరికన్ సైనికులు మరణించారు . బటాన్ ప్రాంతమునుండి ఈ సైనికులను "Balanga " మరొక ప్రాంతానికి తీసుకెళ్లి అక్కడ వారిని బందీలుగా ఉంచేందుకు గానూ వారిచే ఈ మార్చ్ చేయించారు . ఈ మార్చ్ జపాన్ సత్తాను - జపాన్ చేతిలో అమెరికా పరాజయాన్ని సూచించే ది గా కూడా మారింది . ఈ మార్చ్ ఏకధాటిగా 105 కిలో మీటర్ల పాటు జరిగిన మార్చ్ కాదు . మధ్య మధ్యలో సైనికులకు అతి కొంచెము నీరు కొంచెము అతికొంచెము ఆహారము - చాలా కాస్త రెస్ట్ ఇచ్చారు .మొత్తము మీద ఓ మానవునికి సగటున ఇవ్వవలిన ది అని వున్న నియమాల కన్నా తక్కువ ఇచ్చారు అని . అమెరికా దేశము జపాను మీద అణు బాంబు వేయటానికి ఉన్న కారణనల్లో ఈ మార్చ్ మరియూ అందులో 500 నుండి 650 అమెరికన్ సైనికులుమరణించటము కూడా ఒక ముఖ్య కారణము అయ్యింది .

ఫిలిప్పీన్స్ లోనికి.ఓనోడా తో పాటు , {1} ప్రైవేట్- యుఇచి అక్కసు , {2}కార్పోరల్ షో ఇచ్చి షిమాడ , మరియూ [4}ప్రైవేట్ ఫస్ట్ క్లాస్ కింశుచి కోజుక . అనే వారు వున్నారు . వీరు ఐదుగురు కలిసి ఒక టీం . ఇందులో ప్రైవేట్ అనే మాటను చూడండి . మిలిటరీ లో అతి తక్కువ ర్యాంకు లో వున్న సైనికుని ప్రైవేట్ సోల్జర్ అని వ్యవహరిస్తారు . స్వచ్ఛందంగా మిలిటరీ లో చేరి మిలటరీ లోనే కొనసాగటానికి ఇష్టపడిన వారి సామర్ధ్యాన్ని అంచనా వేయటానికి అని వారిని ప్రైవేట్ సోల్జర్ డ్యూటీలో వేస్తారు . ప్రైవేట్ సోల్జర్అ అంటే " తన ఆఫీస్ అంటూ లేని సైనికుడు అని కూడా చెప్పవచ్చు . ఈ ప్రైవేటు సైనికుడు - యుద్ధము కోసము కాక మరి ఏదన్న ప్రత్యేక మైన పనికోసం కేటాయింప పడితే అతడు "enlisted " సోల్జర్ అవుతాడు.

" కార్పోరల్" అంటే - మిలిటరీ నియామకాలు జరిపే సెలక్షన్ కమీషన్ చేత ఎన్నిక కాబడని వ్యక్తి . వీరు ఆర్మీ , ఎయిర్ ఫోర్స్ , మెరైన్ ల లో సార్జంట్

అనే హోదాగల వారిక్రింద నియమింప బడతారు - పని చేస్తారు . వీరి నియామకం అధికారికం కాదు కాబట్టి వీరి అధికార పదవి ఎదో తెలియదు . కాబట్టి వీరిని పిలవటానికి కార్పోరల్ అనే మాట వాడు తారు. ఈ "కార్పోరల్" ఇంతకు ముందు మనము చెప్పుకున్న enlisted సోల్జర్ కు - సీనియర్ నాన్ -కమిషన్డ్ ఆఫీసర్స్ అనే sergeants కి మధ్య వారధిలా లేదా సంధాన కర్తగా పనిచేస్తాడు .

ఇహ "నాన్ -కమిషన్డ్ సార్జంట్ " అంటే - మిలిటరీ నియామకాలు జరిపే సెలక్షన్ కమీషన్ చేత ఎన్నిక కాబడని వ్యక్తి . ఇతడు అప్పటికే మిలిటరీ లో ఉంటూ ఉండగా -ఏదన్న ఒక ప్రత్యేక మైన పని నిర్వహించటానికి మధ్య తరగతి ఆఫీసరుగా మార్చబడిన వంటి వాడు . ఇతడు తన కింద వుండే టీం కి నాయకుడి పాత్ర వహించి నపుడు అతనిని "sergeant" పేరుతో పిలుస్తారు . "sergeant" కొత్త వారికీ ట్రెనింగ్ ఇవ్వటం లోనూ - తన పై అధికారుల ఆర్డర్లు ప్రకారం రోజువారీ కార్యకలాపాలు ఏవో అవి జరపటానికి ఇతడు భాద్యత వహిస్తాడు . మిలిటరీ ఆఫీసర్ల వ్యవస్థలో ఇది దిగువ ర్యాంకు .
ఇక ప్రైవేట్ ఫస్ట్ క్లాస్ (PFC) అంటే ప్రత్యేక మైన పని కోసం వాడబడి - కార్పోరల్ కి ప్రైవేట్ కి మధ్యన వుండే ర్యాంకు లో వున్న వ్యక్తి .
* పై వివరణలు అన్నీ - రొండో ప్రపంచ యుద్ధ కాలములో జపానుకు చెందినవి . ఇండియా వి అని అనుకోని విశ్లేషించ వద్దు . ఎదో కొంచెము కొత్తసంగతులు తెలుసుకునేందుకు అని రాసాను .
యుద్ధము అనగానే బాంబులు తుపాకులు అనే అనుకుంటాము .దీనిని మించినది - ఆలోచనలు చేయటము - వ్యూహాలు పన్నటం - వ్యూహానికి అవసరమైన మనస్తత్వము కల మనుషులను ఏర్పరుచుకోవటము అయి ఉంటుంది .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

**"నేను లొంగి పోలేదు" ono3 05-04-25**

'హీరో ఓనోడా ' కి తన ఆర్డర్స్ డిసెంబర్ 26, 1944 న అందాయి. ఇతడు మిలిటరీ ఇంటిలిజెన్స్ ఆఫీసర్ కాబట్టి - రోజు వారీ జరిగే యుద్ధపోరాటం చేయడు. తన టీం తో కలిసి అరణ్యములో క్రొత్త దారులు కనిపెట్టాలి -ఇతని వెనుక వచ్చే జపాను సైన్యము ఆ దారులను ఉపయోగించుకుంటూ శత్రు స్థావరాల కు - అత్యంత సమీపములో కి వచ్చి శత్రువుమీద మెరుపు దాడి చేసి - అదే మెరుపు వేగంతో అరణ్యాలలో కి మాయం అవుతారు . ఇదే గొరిల్లా యుద్ధము అనబడుతుంది . ఓనోడా కి ఇచ్చిన ఆర్డర్లలో - నీవు ఫిలిప్పీన్స్ కు చెందిన లుబంగ్ దీవి లో ఉండి గొరిల్లా యుద్ధాన్ని నడిపించు - ఎప్పుడూ ఎవరికీ లొంగి పోవద్దు - ఎప్పుడూ ఆత్మ హత్య చేసుకోకు - జపాన్ ఇంపీరియల్ ఆర్మీ వచ్చి నిన్ను కలిసే వరకూ అదీవిలోనే వుండు " - , అనే మాటలు వున్నాయి . "గొరిల్లా యుద్ధాన్ని నడిపించు" అనగా -- నీ వెనుక వచ్చే వారికి దారులు ఏర్పాటు చేయి అనీ- "ఎప్పుడూ ఎవరికీ లొంగి పోవద్దు" అంటే శత్రువు నీకన్నా తెలివి కలవాడై - నీ రహస్య మార్గాలను కనిపెట్టి - వున్నట్లుండి నీ మార్గానికి అడ్డుతగిలి "హాండ్స్ అప్ " అంటే వారికి లొంగి పోక, ప్రాణాలకు తెగించి తిరగ బడు- ఆ ప్రయత్నంలో నువ్వు నువ్వు కాల్పులకు గురి ఐ మరణించి నా మంచిదే - అనే - అర్ధం వున్నదని చెప్పుకోవాలి .

"ఎప్పుడూ ఆత్మ హత్య చేసుకోకు" అనే మాటను ఒక మిలిటరీ ఆర్డర్ లో ఎందుకు వాడారో వివరంగా తెలుసుకోవాల్సిందే . యుద్ధములో ఓటమి భయము ఎదురైనపుడు - ఎవరి ప్రాణాన్ని వారు తీసుకోవాటాన్ని జపాను భాషలో "హరాకిరి లేదా “seppuku” సెప్పుకు అంటారు . ఇది జపాను సమురాయ్ లు ప్రవేశపెట్టిన సంప్రదాయము . Seppuku అనేది జపానులో 12th సెంచరీ లో మొదలైంది . యుద్ధములో ఒడి శత్రువు చేత శిక్షకు గురి అవటం కన్నా - ప్రాణం తీసుకోవటమే ఎక్కువ గౌరవం అని భావించిన సమురైలు ఇలా చేసేవారు . కానీ రొండో ప్రపంచ యుద్ధము నాటికి - "నా దేశమా నీకు జరిగిన దాని పట్ల నాకు అవమానంగా ఉంది" అని ప్రకటించటానికి ఉపయోగించే చెర్య గా ఈ "సెప్పుకు" మారింది . దేశము కోసమే కాకుండా తమకు గౌరవనీయులైన వారు హత్యకు గురి అయినపుడు - లేదా

యుద్ధములో చనిపోయినపుడు -" నేను నిన్ను రక్షించుకో లేక పోయినాను " అనే దుఃఖము చూపటానికి కూడా హరాకిరీ చేసుకునే వారు .

జపాను రెండో ప్రపంచ యుద్ధము చేస్తూ వున్నదే కానీ ఒడి పోతానేమో అనీ లోలోపల భీతి చెందుతూ వున్నది . సైనికులు కనుక ఈ ఓటమిని పసికడితే వారు తప్పక హరాకిరీ చేసుకుంటారు - అన్న భయం జపాను ప్రభుత్వానికి కలిగింది . అందుకని " మీరు హరాకిరీ చేసుకోవటానికి వీలు లేదు " అంటూ తన మిలిటరీ ఆర్డర్స్ లో రాయ సాగింది . అయినా కానీ "జపానుకు - అమెరికా చేతిలో ఓటమి ఎదురుకానుంది " అనీ అంచనా వేసుకున్న అనేక మంది మిలిటరీ అధికారులు "సెప్పుకు లేదా హరాకిరి " చేసుకున్నారు . వీరిలో "కోరుచిక అనామి " అనే జాపనీస్ యుద్ధ శాఖా మంత్రి కూడా వున్నారు . ఈయన August 15, 1945, ఉదయం న "జపాను లొంగి పోతోంది అనే" డాక్యుమెంట్ మీద సంతకం పెట్టాడు - ఆపై "నా దేశమా నీకు జరిగిన దాని పట్ల నాకు అవమానంగా ఉంది" అని ప్రకటించటానికి గానూ హరాకిరి చేసుకున్నాడు .

ఈయన హరకిరికి దారి తీసిన సంఘటన గురించి కూడా కొంచెము తెలుసుకుందాము . జపాను మీద అణు బాంబు పడినాక జపాను చక్రవర్తి ఆగష్టు 14 న లేదా 15 న నో జపాను లొంగి పోతున్నట్లు ఒక రేడియో ప్రకటన చేయపోతూ వున్నాడు అని జపాన్ మిలిటరీ అధికారులకు తెలిసింది. అప్పుడు వారు - చక్రవర్తి మీద తిరుగు బాటు చేసి- ఆయనను ఇంటినుండి కదల కుండా చేసి - అయన " జపాన్ లొంగి పోయింది " అనే ప్రకటనను ఇవ్వకుండా అడ్డు కొని జపానును పెద్ద అవమానం నుండి తప్పించాలని ఆలోచించారు . కానీ ఆ ప్రయత్నం లో వారు విఫలం చెందారు . "ఏది ఏమైనా దేశానికీ జరిగే అవమానము తప్పించ లేక పోయినాము " అన్న ఉద్దేశ్యము తో ఈ తిరుగుబాటుకు పూనుకున్న వారంతా హరాకిరీ చేసుకున్నారు . దీనిని " ది Kyūjō " ఇన్సిడెంట్ అని పిలుస్తారు . వీరు మొత్తము ఎంత మంది చనిపోయి నారు అనేది ఎవరికీ తెలియకుండా అమెరికా చూసుకుంది. దీని ప్రకారము అనుబాంబు పడగానే జపాను లొంగి పోయింది అన్న సంగతిలో కూడా పస లేదు అనిపిస్తుంది . అణు బాంబు పడినా కానీ జపాను లొంగి పోరాదు అనీ

కోరుకున్న వారు అనేకులు వున్నారు . వీరి సంగతులను కూడా అమెరికా బయటి ప్రపంచానికి తెలియ నివ్వలేదు .
ఇహ ఓనోడా మరియూ అతని సహచరులూ అరణ్యము లోనికి వెళ్లే ముందు డివిజినల్ కమాండర్ కి రిపోర్ట్ చేసి వెళ్ళాలి అని చెప్పారు . ఈయన తన నోటి మాటగా - " మీ అంతగా మీరు మరణించ వద్దు - యుద్ధము ముగియటానికి మూడేళ్లు పట్ట వచ్చు లేదా ముప్పై ఏళ్ళు పట్టవచ్చు . ఏమి జరిగినా గాని మేము మిమ్ము వెనక్కి పిలిచే దాకా నీవు వెనక్కు రావద్దు . మీ వెనకాల ఒక్క సైనికుడు ఉన్నా మీరు అతనికి దారి క్లియర్ చేసి ఇవ్వాల్సిందే . ఆహారం కింద కొబ్బరి కాయలు తినాల్సి వచ్చినా సరే మీరు వెనక్కు మరల వద్దు " అని అన్నాడు . ఈ మాటలను ఓనోడా చాల సీరియస్ గా తీసుకున్నాడు .ఈ ఆర్డర్లు ఇచ్చిన అయన కూడా అతడు ఆ ఆర్డర్లు అంత సీరియస్ గా తీసుకుంటాడు అనుకో లేదు .
ఓ మామూలు కొబ్బరి కాయలో వుండే దానిని "Coconut meat " అంటారు . అంటే మాంసము లాంటిది అని . దీనిలో చిక్కని రూపము లో ఉన్నా శక్తి - ఫ్యాట్స్ , ప్రోటీన్స్ , విటమిన్స్ , and మినరల్స్ , ఇంక్లుదింగ్ కాల్షియమ్ , ఐరన్ , and మెగ్నీషియం వుంటాయి .ఒక మోతాదులో తిన్నపుడు కొబ్బరి ఆరోగ్యానికి మంచిదే . కానీ ఇది ఏ పోషక ఆహారము దొరకనప్పుడు తినవల్సినది మాత్రమే . మిలటరీ వారికీ రోజు అన్నమో బ్రేడ్ నో దొరకదు కాబట్టి వారికి కొబ్బరి తిన మని చెపుతారు . ఆ మోతాదు కూడా నిర్ణయిస్తారు . మామూలు వారికి కొబ్బరి అనారోగ్యం .
1944 లో అందిన ఈ ఆర్డర్ ను ఫాలో అయినా ఓనోడా చివరకి March 9th 1974 న ఫిలిప్పీన్ అడవుల్లోనుండి బయటకి వచ్చాడు .

నేను లొంగి పోలేదు **ono4 09 -04 -25**

ఫిలిప్పీన్స్ అరణ్యాలలోని శత్రుల -{ అమెరికన్ సైన్యపు } కదలికలను గుర్తించటం కోసం " ది సుజి బ్రిగేడ్ " అనేది పనిచేస్తూ వున్నది . ఓనోడా December 17, 1944 ఈ సుజి బ్రిగేడ్ కి డ్యూటీ కి రిపోర్ట్ చేసాడు . "యోషిమి తనిగుచి", మరియూ మేజర్ "తకహాషి" అనే వారు ఓనోడా కి

డ్యూటీ ఆర్డర్స్ అంద చేశారు . ఆ ఆర్డర్లు ప్రకారం ఓనోడా "లుబంగ్" దీవులలో వున్న - ఫిలిప్పీన్స్ గెరిల్లాలు ప్లస్ అమెరికా సైనికులను ఎదుర్కొనే జపాను సైనిక దళానికి బాహ్య రక్షక వలయంగా పని చేయాలి . అంటే ఇతడు తన సొంత తెలివితో ఇన్ఫర్మేషన్ పోగు చేసుకుని - తన వెనుక వచ్చే వారికి ప్రమాదం కలగని దారులకుండా వారిని శత్రు స్థావరాల కు అతి సమీపంగా తీసుకు పోవాలి . తన వెనుక ఒక్కడే సైనికుడు వున్నా వంద మంది ఉన్నా ఓనోడా చేయవల్సిన ముఖ్యమైన డ్యూటీ ఈ దారి చూపటమే . ఇది అతని మొదటి ప్రయారిటీ డ్యూటీ

అమెరికన్ సైనికులు ఫిలిప్పీన్స్ వారి లుబంగ్ దీవిలోకి దిగి -- ఆపై ఫిలిప్పీన్ గెరిల్లల సాయంతో అరణ్యాలలోకి వెళ్లి దాక్కుని జపాన్ మీద దాడులు జరిపే వారు. ఫిలిప్పీన్స్ ,అంతటా వున్న ఈ "ఫిలిపినో గెరిల్లాలు" అనే వారు అమెరికన్ సైనికులను ఫిలిప్పీన్స్ లోకి ప్రవేశ పెట్టటం - వారిని కొండలు/ అరణ్యములలో ని రహస్య ప్రాంతాలకు తరలించి దాటి పెట్టటం వంటి పనులు చేస్తూ వుండే వారు .ఈ ఫిలిప్పీన్ గొరిల్లాస్ తాము అమెరికా దేశానికీ సహాయ పడటం ద్వారా తమ దేశానికి జపాను నుండి స్వాతంత్రము సంపాదించాలన్న లక్ష్యం తో ఈ పనులు చేస్తూ వుండే వారు. అందుకని - లుబంగ్ దీవి మీదకు అమెరికెన్ సేనలు ప్రవేశించకుండా - విమాన రన్వే ని - నౌక శ్రమం లోని పీర్ ని ధ్వంసం చేయటము- ఓనోడా కి వున్న రొండో ప్రయారిటీ పనులు .{సముద్రములో సరుకుల ఓడలు ఆగినప్పుడు దానిలోని సరుకును ఒడ్డుకు చేర్చటానికి సముద్రములోనే ఒక చెక్క వంతెన కట్టి ఉంచుతారు - వీటిని - పీర్ - అంటారు}

ఇవి కాక "ఓనోడా" చేయ వల్సిన మరొక డ్యూటీ కూడా వున్నది . లుబంగ్ దీవిలోకి ప్రవేశించటానికి వస్తూ వున్న అమెరికన్ విమానాల గురించి, ఓడలగురించి ముందస్తు గా దొరికే సమాచారం సేకరించి దానికి జపానుకు అందించటం . ఇది ఓనోడా కి మూడో ప్రయారిటీ డ్యూటీ .
ఇహ ఓనోడా తనకు అప్పగించ బడిన పనులు చేద్దామని రంగములోకి దిగే సమయానికి - అక్కడ వున్న "సుజి బ్రిగేడ్ " సైనిక అధికారులు తమకు

అమెరికా చేతిలో ఓటమి తప్పదు అనే అంచనాకి వచ్చి - ఆ దీవిని ఖాళీ చేసి పోయే ఏర్పాట్లలో వున్నారు . అందువల్ల వారు " మేము శత్రువుల కంటపడకుండా వారి మీదకు దాడి చేసే మార్గాల గురించి కాకుండా -- శత్రువు కంట పడకుండా మేము ఈ దీవిని వదిలి పోయే మార్గాల కోసం వెతుకు . అదే నీ ఫస్ట్ ప్రయారిటీ . తరువాతే మిగతా పనులు " అని ఆర్డర్ వేశారు . అంతే కాకుండా విమానాశ్రయాన్ని ధ్వంసం చేయటానికి కావాల్సిన మందు గుండు సామాగ్రి కూడా ఇవ్వ లేదు - ఆ మందు గుండు సామాగ్రి ని తాము తప్పించుకో పోయేటపుడు అవసరపడితే వాడటానికి దాచుకున్నారు . ఇట్లగా ఓనోడా కి కాంఫ్లిక్టింగ్ ఆర్డర్స్ అంటే పరస్పర విరుద్ధ మైన ఆదేశాలు లభించాయి . ఫలితంగా ఓనోడా ఏమీ సాధించలేక పోయాడు .

దీన్ని బట్టి యుద్ధము మీద జపాన్ మిలటరీ హై కమాండ్ ఒక రకంగానూ - కిందిస్థాయి మిలిటరీ మరోరకంగానూ ఆలోచిస్తూ వున్నది అని అర్ధం చేసుకోవచ్చు . ఈ పరిస్థితుల వల్లనో మరెందుకో గానీ - లుబంగ్ ద్వీపం మీద జపాన్ వారి కదలికలు మందగించి పోయాయి . ఇది గ్రహించి న అమెరికా శరవేగంతో ఆ ద్వీపం ఆక్రమణకు పూనుకుంది . అమెరికా సైనికులు లుబంగ్ ద్వీపంలో విచ్చలవిడిగా సంచరిస్తూ ఉండటం చూసిన ఓనోడా మరియూ అతని పై అధికారులు అరణ్యపు లోతుల్లోకి కదిలారు . అందుకోసమని వీరు చిన్న చిన్న గ్రూప్ లాగా విడిపోయారు. ఇట్లాంటి గ్రూప్ ల లీడర్లు - తమ సొంత నిర్ణయాలు తాము తీసుకుంటూ - ఎవరి దారి న వారు ముందుకు సాగి పోతారు .పెద్ద గ్రూప్ గా కదిలితే - ఆ కదలికలు అమెరికా వారికి సులభంగా తెలిసి పోతాయి కాబట్టి - ఈ గ్రూప్ లు ఇంకా చిన్న గ్రూప్ లుగా విడి పోయి అంటే నలుగురు లేదా ముగ్గురు ఉండే గ్రూప్ లుగా విడి పోయి ఎటు పడితే అటు వెళ్లి పోయాయి .

ఇట్లా గా ఓనోడా తాను రిపోర్ట్ చేసిన "సుజి" సైనిక దళము లోని ఒక గ్రూప్ తో కలిసి అడవుల్లోకి దూరిపోయాడు. ఈనాడు వున్న అధునాతన కమ్యూనికేషన్ వ్యవస్థ ఆరోజుల్లో లేదు .ఇదే కాకుండా పెద్ద దళము చిన్న టీం లుగా విడి పోయింది కాబట్టి -- ప్రతి ఒక్కరి దేగ్గరా కమ్యుని కేషన్ పరికరం ఉండటం

సాధ్యం కాలేదు .  ఇదీకాక   ఏదన్న కమ్యూనికేషన్ పరికరం ద్వారా మాట్లాడుకుంటే దాన్ని శత్రువులు వింటారేమో అనే భయం వుంది కదా ? . ఇదీకాక ఓనోడా గెరిల్లా పోరాటం జరపవ్సల్సిన సైనికుడు . అందువల్ల ఇతడు ఎవరికైనా ఏదైనా సందేశం ఇవ్వాలి అంటే చేతుల ద్వారానూ - నిప్పును రగిలించగా  వచ్చే మంటతోనూ - పొగ తోనూ సందేశాలు ఇవ్వవలసి వుంది . . ఈ కారణంగా  అడవి లోకి ప్రవేశించినపుడు  ఇతని టీం వద్ద  ఏ విధమైన కమ్యూనికేషన్ ఎక్విప్మెంట్ లేకుండా పోయింది . అలాగే అరణ్యం లో ఎదురయ్యే సమస్యలను ఎదుర్కోవాలన్న  తన  పట్టుదలను నీరు గార్చేందుకు అని శత్రువులు సాధారణ వ్యక్తులద్వారా తనతో   ప్రయత్నిస్తారేమో అనే జడుపుతో - ఓనోడా తన దేశము వారు  కాని  ఇతరులతో మాట్లాడి - సంగతులు తెలుసుకోవటానికి  ఇష్టపడే వాడు కాదు .అందువలన కూడా ఇతనికి తాజా యుద్ధ వార్తలు తెలిసేవి కావు .

6 మరియూ  9 ఆగష్టు   1945  న  అమెరికా జపాను పై ఆటం బాంబు వేసింది . అప్పుడు జపాను లొంగి పోయింది అన్నట్లు   చెరిత్రలో చదువుతాము .. కానీ - తమ జపాన్ మీద ఆటం బాంబు పడినా  గానీ  జపాను లొంగి పోరాదు అని అనేకులమంది సైనిక అధికారులు కోరుకున్నారు- వారు లొంగు బాటును వ్యతి రేకిస్తూ  హరాకిరీ లు కూడా చేసుకున్నారు. కానీ August 15, 1945. న మిట్ట మధ్యనపు పూట జపాన్ చక్రవర్తి తానూ లొంగి పోతున్నట్లు ఒక రేడియో ప్రకటన చేసాడు..  September 2, 1945  న జపాను తాను లొంగి పోతున్నట్లు సంతకాలు చేసింది .  ఈ విషయాలు ఏవీ ఓనోడా కు తెలియలేదు .

నేను లొంగి పోలేదు **12 -04 -25 ono5**

రెండో ప్రపంచ యుద్ధ సందర్భంగా ఫిలిప్పీన్స్ కు చెందిన  లుబంగ్ ద్వీపము మీద వున్న  ఓనోడా-- ఆ ద్వీపం మీద రోజు రోజుకు పెరుగుతున్న అమెరికన్ సైనికుల ద్రుష్టి నుండి తప్పించుకోవటానికి అని అద్వీపం మీద వున్న అరణ్యం లోని  ఇంకా లోతుల్లోకి వెళ్ళాడు . ఓనోడా తో పాటు 01.  యుఇచి  అక్కసు , 02 .కార్పొరల్  షో  ఇచ్చి  షిమాడ , మరియూ  03 .  కింశుచి  కోజుకైతని . అనే ముగ్గురు సైనికులు వున్నారు . ఈ నలుగురూ కలిసి ఒక టీం .

ఆగష్టు 15, 1945 న జపాన్ తాను అమెరికాకి లొంగి పోతున్నట్లు ప్రకటన చేసి సెప్టెంబర్ 2, 1945, న అందుకు సంభందించిన ఒప్పందం మీద సంతకాలు పెట్టింది ."యుద్ధములో జపాన్ లొంగిపోయింది - కాబట్టి ఫిలిప్పీన్స్ మారుమూలల్లో దాక్కున్నా జపాన్ సైనికులు ఎవరన్నా ఉంటే వారు బయటికి వచ్చి లొంగి పోవాలి " అని కోరుతూ అమెరికా ఫిలిప్పీన్స్ అంతటా విమానాల ద్వారా కరపత్రాలను వెదజల్లింది . దీనిని బట్టి ఫిలిప్పీన్స్ అడవుల్లో దాక్కున్న జపాన్ సైనికులకు తాజా యుద్ధ వార్తలు తెలిపే కమ్యూనికేషన్ వ్యవస్థ ఏదీ ఆరోజుల్లో లేదని మనము గ్రహించవచ్చు . అడవుల లోలోపలికి వెళ్లినాక ఓనోడా మరియూ అతని అనుచరులు ముగ్గురూ - అడవులను వీడి బయటికి రావటానికి వీలు లేని పరిస్థితులు ఎదుర్కొన్నారు . వారికి అధికారికంగా ఏ వార్తలూ అందటం లేదు . అమెరికా లుబంగ్ దీవిని ఆక్రమించుకున్నదే కానీ - దాని మీద మరీ పట్టుబిగించటం దండగ అన్న ధోరణిలో ఉండేది. అందువలన ఆ దీవి మీద అమెరికా సైనికుల సంచారం మందగించింది. దీనిని చూసి 'అమెరికా వెనుకంజ వేసింది' అని ఓనోడా అనుకున్నాడు.

జపాన్ యుద్ధములో ఓడి పోతుంది అన్న మాట ఓనోడా కలలో కూడా ఊహించనిది . ఒక వేళ నా దేశం ఓడి పోయినా కానీ నేను లొంగిపోను - నా వంతు పోరాటం నేను కొనసాగిస్తాను అనే పట్టు దల ఇతనికి వున్నది . తన ఈ పట్టు పట్టుదలను నీరు గార్చేందుకు అని , శత్రువులు లేదా తనకు ఎదురయ్యే సాధారణ వ్యక్తులు ప్రయత్నిస్తారేమో అనే జడుపుతో - ఓనోడా తన దేశము వారు కాని ఇతరులతో మాట్లాడటానికి గానీ - సంగతులు తెలుసుకోవటా నికి గానీ ఓనోడా ఇష్టపడే వాడు కాదు.

"యుద్ధములో జపాన్ లొంగిపోయింది - కాబట్టి ఫిలిప్పీన్స్ మారుమూలల్లో దాక్కున్నా జపాన్ సైనికులు ఎవరన్నా ఉంటే వారు బయటికి వచ్చి లొంగి పోవాలి " అని కోరుతూ అమెరికా ఫిలిప్పీన్స్ అంతటా విమానాల ద్వారా కరపత్రాలను వెదజల్లింది . కదా ? యుద్ధము జరుగుతున్న సమయములో కూడా - అమెరికా ఇట్లాగే కొన్ని కరపత్రాలను - విమానాల్లోనుండి జపాన్ వారి

కంట్రోల్ లో వున్న ఫిలిప్పీన్స్ మీదకు ఇలాగె వెదజల్లుతూ ఉండేది . ఈ కరపత్రాలతో - "అమెరికాకి లొంగి పోండి - బ్రతికి పోండి " అనే నీతి వాక్యాలు - ప్రజలకు పిరికి మందును నూరి పోసే అసత్య యుద్ధ కధనాలు ,ప్రజలలో వుండే దేశభక్తిని సూన్యం చేయటానికి ఉద్దేశించిన వాగ్దానాలూ ఉండేవి . వీటితో పాటు "మా దగ్గర పెద్ద బాంబు వుంది . రేపు దానిని మీవూరు మీద వేయబోతున్నాము " అనే అసత్యపు హెచ్చరికలు కూడా ఆ కరపత్రాలతో ఉండేవి . అందువల్ల అమెరికా వేసిన ఈ "లొంగిపోండి " అనే కరపత్రాలను ఓనోడా నమ్మలేదు.
హీరూ ఓనోడా దృష్టిలో రెండో ప్రపంచ యుద్ధము అనేది జపానుకు అమెరికాకు మధ్య జరుగుతున్న యుద్ధము . తన దేశము లొంగి పోదు అని - కానీ-- జపాను ఏదన్నా పరా జయము పొందితే అది జపానులో సూర్యుని అస్తమయం లాంటిది అని - ఈ సూర్యుడు రేపు ఉదయించినట్లే జపాను మళ్ళా రేపటి రోజున రోజున తిరిగి యుద్ధము చేస్తుందని ఓనోడా కి వ్యక్తిగత నమ్మకము వుంది .అందువల్ల ఈ ఫిలిప్పీన్స్ దీవుల గురించి - జపానుకు అప్పటికి కావాల్సిన సమాచారాన్ని సేకరించి పెట్టు కొని దానిని అందచేయటం తన విధి అవుతుందని ఓనోడా అనుకున్నాడు . అరణ్యములో నివసిస్తూ - అరటి పళ్ళు కొబ్బరి కాయలు తింటూ అతడు అరణ్యము అంతా తిరుగుతూ సమాచారాన్ని సేకరించి పెట్టుకుంటూ వున్నాడు. అంటే నా డ్యూటీ నేను చేసుకుంటూ వున్నాను అనుకుంటూ వున్నాడు . యుద్ధము ముగిసి పోయినా కానీ యుద్ధము జరుగుతూనే ఉంది అనే నమ్మకంతో వున్నాడు .
ఏది ఏమైనా -- ఎదో ఒక ఆహారం కోసం - ఏ రాత్రి వేళలోను ఓనోడా ఫిలిప్పీన్ ప్రజల ఆవాసాల వైపు పోక తప్పటం లేదు . ఆలా వెళ్ళినపుడు - ఒక గ్రామపు కాలి బాట మీద పడివున్న ఒక కర పత్రం ఓనోడా కి దొరికింది . దానిలో "యుద్ధము ఆగష్టు 15 న ముగిసిపోయింది .మీరు కొండలను వీడి రండి " అని వుంది . ఓనాడాకి ఇది నిజము అని నమ్మే దానికి ఎలాంటి అవకాశమూ కనపడలేదు . కారణం " యుద్ధము ముగిసి పోతే - ముగించుకొని అంతటితో వెళ్లి పోవాలి కానీ ఈ అరణ్యం లో వున్న మమ్ము లొంగి పొమ్మని ఎందుకు అడుగుతున్నాబు ? మాదేశము కదా మమ్మల్ని వెనక్కి పిలవాలి ? అమెరికా

ఇట్లా ఎందుకు అడుగుతోంది ? అనే అనుమానం పొందాడు . కాబట్టి ఈ కరపత్రం ఒక ట్రిక్ లేదా ఎర లేదా ఒక పులి బోను లాంటిది అనుకున్నాడు .

ఇహ అమెరికా దేశము తన పట్టు వదలక ఆఖరి శత్రువును కూడా కనుగొనాలని భావించి 1945 సంవత్సరం చివరివరకూ అనేక దఫాలుగా - ఓనోడా మరియూ అతని లాంటి వారు దాగివున్న ద్వీపాల మీదకు కరపత్రాలను విమానాల ద్వారా వెదజల్లింది . ఈ కరపత్రాలు జపాన్ అధికారుల పేరు మీద వచ్చాయి . అసంఖ్యాకంగా లభ్య మవుతున్న ఇలాంటి కరపత్రా లు ఎవరి పేరున విడుదల అవుతున్నావా ? అని ఓనోడా మరియూ అతని అనుచరులు పరిశీలించారు . ఇవి జపాన్ మిలిటరీ జనరల్ "యమషిత టొమోయుకి" అనే వారి పేరు మీద జారీ అవుతున్నవి .ఈ జనరల్ యమషిత - ఓనోడా వంటి మిలిటరీ ఇంటిలిజెంట్ ఆఫీసర్లు తన కింద వున్నారని -వారు అమెరికాకు వ్యతిరేకంగా పని చేస్తూ వున్నారని-- బహిరంగంగా ఒప్పుకునే వాడు కాదు . వారి ఉనికిని వీలున్నంత గోప్య పరుస్తూ ఉండేవాడు . అలాంటి వాడు తమను ఉద్దేశించి ఇలాంటి కరపత్రాలు విడుదల చేస్తాడా ? అని ఓనోడా అనుమానించాడు . జనరల్ యమషిత" ది బాటిల్ అఫ్ సింగపూర్ ".అనే దానికి నాయకుడిగా ఉండి "మనము ఏదైనా ఒక యుద్ధములో లొంగి పోవటానికి బదులు - మరణించటానికె మొదట ప్రాధాన్యము ఇద్దాము " అనే మాటలు పలికిన వ్యక్తి .ఇలాంటి వ్యక్తి పేరున తమను లొంగి పొమ్మని కోరే సందేశము ఏమిటి అని కూడా ఓనోడా చాలా అనుమానించాడు . కరపత్రాన్ని పరిశీలిస్తున్న కొద్దీ ఒకే ఒకవాక్యము అతని మనసును తొలచ సాగింది . ఆవాక్యము ఏమిటంటే లొంగి పోయిన వారు "hygienic succor" గా భావించబడి జపానుకు తరలింప బడతారు అని . " hygienic succor " అనగా పగా ప్రతీకారాలు అనేవి మనసు లో లేకుండా శుద్ధి చెంది - శత్రువుకు సహాయం చేయటానికి ముందుకు వచ్చిన వాడు అని అర్థం . ఒక జపాను వాడు - తన తోటి జపాను వాడిని " నీవు నీ న శత్రువు పట్ల పగ ప్రతీకారాలు లేకుండా శుద్ధి పొందిన మనస్సుతో వాడికి లొంగిపో అని భోదిస్తాడా ? అనుకున్న ఓనోడా తనకు దొరికిన కరపత్రాలను ఒక పెద్ద చెత్త ట్రిక్ గా భావించాడు ." hygienic succor " అనే మాటను వాడటంతో అమెరికా

ఉద్దేశ్యము " మీకేమీ హాని చేయకుండా జపానుకు తరలిస్తాము " అని చెప్పటమే .
ఇది ఇలా ఉండగా 1949, లో ఓనోడా తో పాటు వున్న "అక్కసు" తన వరకూ తాను లొంగి పోదలుచుకున్నాడు . ఇతడు సెప్టెంబర్ 1949 లో చెప్పా పెట్టక అరణ్యంలోకి మాయం అయ్యి - ఆరు నెలల పాటు అరణ్యంలో దారితప్పి తిరిగి - చివరికి అమెరికా వారికి లొంగి పోయాడు . ఓనోడా దీని గురించి "నా శత్రువు నా మనిషిని ప్రలోభ పెట్టి లొంగతీసుకున్నాడు " అని అనుకున్నాడు .
"అక్కసు" తనతో పాటు అరణ్యం లో పనిచేసిన వారి పేర్లను అధికారులకు తెలిపాడు. అట్లాగా హీరో ఓనోడా మరి ఇద్దరూ ఇంకా ఫిలిప్పీన్ అరణ్యాలలోనే వున్నారని జపానుకు - జపానులోని వారి కుటుంబాలకు - అమెరికాకి తెలిసింది .అప్పుడు అమెరికా ఓనోడా ఫోటో - అతని బంధు మిత్రుల ఫోటోలు వున్న కరపత్రాలని రూపొందించి " ఓనోడా అండ్ టీం లొంగి పోవాలి " అని డిమాండ్ చేసింది .

లొంగిన పోయిన "అక్కసు" నుండి సమాచారం రాబట్టి దాని ఆధారంగా తనను లొంగ తీయాలన్నదే శత్రువు వ్యూహం కావచ్చు నాని ఆలోచించిన ఓనోడా అరణ్యం లోని మరింత లోపలి వెళ్లి దాక్కో సాగాడు . తన చుట్టు పక్కలను లక్ష కన్నులతో గమనిస్తూ మరింత అప్రమత్తంగా మారాడు ..

నేను లొంగి పోలేదు **ono6 17-04-25**

ఫిలిప్పీన్స్ లోని లుబంగ్ దీవిమీద వున్న అరణ్యములో ఓనోడా తో పాటు-- 01. యుఇచి అక్కసు , 02 .కార్పోరల్ షో ఇచ్చి షిమాడ , 03 . కింశుచి కోజుకైతని ,అనే నలుగురూ కలిసిన ఒక జాపనీస్ మిలిటరీ టీం దాక్కొని వున్నది .

ఒక సారి "కార్పోరల్ షూ ఇచ్చి షిమాడ "మామూలు ఆహారాన్ని{ అన్నాన్ని /బియ్యాన్ని} అన్వేషిస్తూ ఒక ఇంటిలో దొంగతనానికి పోయి ,ఒక చేపలు పట్టే వాని కంట పడి - వాడి చేతుల్లో గాయ పడ్డాడు . అప్పుడు -- ఓనోడా --

కుంటుతూ వున్నా "షిమాడ" ని  అరణ్యాలలోకి తరలించుకువెళ్ళాడు . షిమాడ" ని   తిరిగి నడిపించాడు .  "ఒకమనిషి ఇంకో మనిషిని అరణ్యాలలోకి తరలించుకు పోయాడు " అన్న ఈ సంఘటన ఫిలిప్పీన్  పోలీసు అధికారుల దృష్టికి వెళ్ళింది .  వారు ఓనోడా ని ప్రేతుకుతూ  అడవుల్లోకి వచ్చారు . అప్పుడు  వీరు  తమకు అకస్మాత్తుగా తారస పడిన   "కార్పోరల్  షూ ఇచ్చి షిమాడ "ని    లో  కాల్చి చంపి వేశారు. ఇది    May 7, 1954, న జరిగింది .ఈ కాల్పులు జరిపిన  పోలీస్ వారు "హాండ్స్ అప్" లేదా " లొంగి పోండి"  అనే హెచ్చరిక మాటలు  చెప్పకుండానే  కాల్పులు జరిపారు  - అనగా  " ఈ అరణ్యములో దాగివున్నది  మా దేశ శత్రువులు అని మాకు తెలుసు - మీకు మా  మర్యాదలు ఏమిటి ?" అనే ధోరణి అవలంభించారు అని ఓనోడా దీనికి అర్ధం చెప్పుకున్నాడు  .

యుద్ధము  జరుగుతూ ఉండగా శత్రు సైనికులు ఒకరికొకరు తారస పడితే  - వారు "హాండ్స్ అప్ లేదా   లొంగి పోండి" అనే హెచ్చరిక మాటలు చెప్పుకోరు . హెచ్చరిక "మాట ఏదీ చెప్పకుండానే షిమాడపై కాల్పులు జరిపారు అంటే ? ఆ కాల్పులు యుద్ధములో ఒక భాగమే కదా ? అంటే యుద్ధము కొనసాగుతున్నట్లే కదా ? యుద్ధము ముగిసి పోయి ఉంటే నా సహచరుడిని ఏ హెచ్చరికలు లేకుండా   కాల్చి చంపారు ? కాబట్టి యుద్ధము ముగిసింది అన్నది ఒక అసత్యపు వార్త " అని ఓనోడా మరొక సారి తనను తాను నమ్మించుకున్నాడు  .

ఓనోడా తో పాటు వున్న   "అక్కసు" సెప్టెంబర్  1949  లో   అమెరికా వారికి లొంగి పోయాడు కదా ?  రెండో వాడు  షిమాడ హతమయ్యాడు.  .ఇప్పుడు ఓనోడా తో పాటు ఉన్నది   "ప్రైవేట్   ఫస్ట్  క్లాస్  కింశుచి  కోజుక " మాత్రమే . వీరు ఇద్దరూ కలిసి మరలా  అరణ్యం మారు మూలల్లోకి  వెళ్లి పోయారు .

ఓనోడా మరియూ  కోజుక కలిసి -   అరణ్యంలో తిరుగుతూ --  తమను చూసిన ఫిలిప్పీన్స్ అడవి జాతి మనుషులను - 30 మందిని చంపారు .  వారి ద్రుష్టి లో ఇదంతా  - తమ ఉనికి శత్రువులకు తెలియకుండా చూసుకోవటం అనే  డ్యూటీ లో భాగము  /జాగ్రత్త   . కానీ  ఇందులోని ప్రతి హత్యా తరువాత -  వీరి కోసం

పోలీసు వారు వేటాడటం మరింత ముమ్మర మైంది . ఇలాంటి ఒక వేటలో " కింశుచి కోజుక " October 1972 లో కాల్చి చం ప పడ్డాడు .

షిమాడ ,1954 లో కాల్చి చంపబడగా ఆ తరువాత దాదాపు 18 ఏండ్ల తరువాత కోజుక కాల్చి చంప బడ్డాడు . అంటే వీరిద్దరూ కలసి యుద్ధము ముగిసిపోలేదు అని ఒకరిని ఒకరు నమ్మించుకుంటూ 18 ఏండ్ల కాలం పాటు అరణ్య వాసం చేశారు అని. ఈ కాలంలో ఓనోడా మరియూ కోజుక " "మీ అవసరం మీ దేశానికీ కలిగింది . వెనక్కి రండి " అనే కబురు ఉన్న కరపత్రము ఏదన్నా విమానాల నుండి జారిపడుతుందేమో ? అని ఆశించే వారు .కానీ అమెరికా మాత్రం " ఓ జపాను సైనికులారా మీరు లొంగి పోండి" అనే కరపత్రాలనే వెదజల్లుతూ ఉండేది . " ఓ జపాను సైనికులారా మీ దేశం మీ సేవల కోసం తపిస్తోంది " అనే మాదిరి సందేశాలుఇచ్చివుంటే - యుద్దానంతరం అమెరికాకి ఇలాంటి తిప్పలు అనేకం తప్పేవి అని విశ్లేషకులు అన్నారు . జపాను సైనికుల మనస్తత్వాలనను అంచనా వేయటంలో అమెరికా వారి "తెలివి తెల్లారినట్లే" ఉందని చెరిత్ర కారులు అన్నారు .

ఎదో ఓ విధంగా ఓనోడా ఉనికి అనేకమార్లు నిర్ధారణ అవుతూ ఉండటంతో - అమెరికా ఈ సారి కరపత్రాలను కాక న్యూస్ పేపర్లను విమానాల ద్వారా నేలపై వేసింది . " ఆ న్యూస్ పేపర్లలో - ఓనోడా బంధు మిత్రుల ఫోటో లు వేసి "నీ బంధువులు నీ రాకకై ఎదురు చూస్తున్నారు " అనే ప్రకటన వేసింది . వీటిని చూసిన ఓనోడా - తనను లొంగతీయటం లో అమెరికాకి ఎదో గొప్ప ప్రయోజనం వున్నదని - లేక పోతే తన మీద ఇంతగా ఎందుకు ధ్రుష్టి పెడతారు ? అని - తాను లొంగి పోకుండా ఉంటే నే జపానుకు ఎదో గొప్ప ప్రయోజనం కలుగుతుందని ఓనోడా నమ్మాడు . తనవల్ల దేశానికీ ఎదో గొప్ప ప్రయోజనం ఉన్నదన్న ఆలోచన కలిగిన పిదప - ఏది జరిగినా గానీ-- ఏమి చూసినా గానీ అది- ఓనోడా దృష్టిలో అది త్రీవ్రంగా అనుమానింప దగ్గ సంగతే అయ్యింది . తన చివరి మాటగా "యుద్ధము అనేది పూర్తి కాలేదు నేను లొంగి పోతే గనుక నా దేశపు గౌరవము దెబ్బ తింటుంది " అని మరొక సారి మనసులో గట్టిగా అనుకున్నాడు . తరచూ తమ కంట పడుతూ ఉన్న గ్రామీణులు -

నిజంగా గ్రామీణులు కాదని- తన లాంటి - మిలిటరీ ఇంటిలిజెన్స్ ఆఫీసర్లేనని అని ఓనోడా తనలో తాను తీర్మానించుకున్నాడు .

మనుషుల కైనా, మృగాలకైనా వర్తించే ప్రాధమిక విషయం ఒకటుంది . అదేమిటంటే తమకు ఆహారాన్ని అందించే వారు తమ మిత్రులనీ - తమ ఆహారాన్ని తమకు దూరం చేసేవారు తమ శత్రువులనీ భావించుకోవటం. సృష్టి ఆది నుండీ అంతం వరకూ ఈ భావన ఉండేదే . తినటానికి మాంసము కోసము అని ఓనోడా ఏదన్నా జంతువు మీద కాల్పులు జరిపిన మరుక్షణం - ఇతన్ని వెతుక్కుంటూ పోలీసులు వచ్చేవారు . వచ్చి ఇతను ఆహారం తినకుండా ఆటంకాలు కల్పిస్తూ ఉండేవారు . ఈ ఫిలిప్పీన్స్ పోలీసులు వస్తూ వస్తూ ఆహారం- పానీయం వంటివి ఏవీ తమ వెంట తెచ్చే వారు కాదు . దీని గురించి ఓనోడా "నాకు ఎదురు పడుతున్న వారు నా మిత్రులే అయితే నా ఆహార అవసరాలు ఎందుకు గుర్తించరు? కాబట్టి వీరు నా శత్రువులే అని తర్కించుకునే వాడు .

ఇట్లా గా- ఓనోడా ముందుగా ఓ అపనమ్మకం కలిగించుకొని దాన్ని బలపరుచుకోవటం కోసం దానిపై మెట్టు లాంటి మరో అపనమ్మకం కల్పించుకోవటం చేస్తూ వచ్చాడు . ఇది మానవులు సహజంగా చేసేదే . కాబట్టి ఓనోడా కూడా అదే చేసాడు .

ఏది ఏమైనా కానీ తన జపాను దేశము ఫిలిప్పీన్ ఐలాండ్స్ ని వదులుకుంటుందని ఓనోడా కలలో కూడా అనుకో లేదు . అందువల్ల "నాకు సేవచేవలిసింది అని నా దేశము మరల ఏ నిముషములోనైనా నన్ను ఆదేశించ వచ్చు. కాబట్టి అంత వరకూ ఈ ఫిలిప్పీన్ ఐలాండ్స్ పై నిఘా పెడుతూ జీవించటమేనా భాద్యత అని ఓనోడా పలుమార్లు తీర్మానించుకున్నాడు .
.
ఏది ఏమైనా ఓనోడా బ్రతికె వున్నాడు , కానీ జపానుకు తిరిగి రాలేదు -- ఎందుకు రాలేదు ?ఏమైనాడు? అన్న ప్రశ్నలు - వాటి మీద అనేక ఊహాజనిత కధనాలు జపాను వార్తా పత్రికలలో - వచ్చాయి . అప్పుడు జపాన్

ప్రభుత్వమూ  ఒక సెర్చ్ పార్టీని ఫిలిప్పీన్ అడవుల్లోకి పంపింది  . వీరు ఆరు నెలల పాటు  గాలించి - "ఓనోడా చని పోయినట్లు అధికారికంగా  ఓ ప్రకటన ఇవ్వ వచ్చు " అంటూ  జపాను ప్రభుత్వానికి సిఫార్సు చేశారు .దీనితో ఓనోడా చనిపోయినట్లు జపాను  1959 లో ఓ అధికారిక ప్రకటన వచ్చింది  .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

నేను లొంగి పోలేదు    **ono7    18-04-25**

ఓనోడా చనిపోయినట్లు జపాను ప్రభుత్వం   1959 లో ఓ   అధికారిక ప్రకటన వచ్చింది  . కానీ మీకు గుర్తు వుంది అనుకుంటే - ఓనోడా చివరి అనుచరుడైన " కింశుచి  కోజుక " ను ఫిలిప్పీన్  పోలీసు లు  - October 1972  లో కాల్చి చంపారు . అనగా ఓనోడా చని పోయినాడు అని జపాను ప్రభుత్వము అధికార ప్రకటన ఇచ్చిన తరువాత 12  ఏండ్లకు  కోజుక కాల్చి చంపబడ్డాడు .   ఫిలిప్పీన్ అడవులలో    27 ఏండ్లు గడిపి,   తన    51 సంవత్సరాల వయస్సులో -కోజుక , మరణించాడు . ఇతని మృత దేహాన్ని చూసాక - ఓనోడా కూడా ఇతని లాగానే ఇంకా బ్రతి కి ఉన్నాడేమో అనే సందేహము జపాన్ ప్రభుత్వానికి కలిగింది . అందువలన మరల ఒక సెర్చ్ పార్టీని పంపారు .

తన సహచరుడైన "కోజుక " మృతి తరువాత  "ఓనోడా "తోడు ఎవరూ లేని ఒంటరిఅయినాడు  . ఇప్పుడాతడు ఎవరికీ ఆర్డర్లు ఇవ్వక్కరలేదు తీసుకోనక్కరలేదు . ఎవరి క్షేమము ను గురించి ఆలోచించవలిసిన పని ఏ లేదు . ఓనోడా కి ఇచ్చిన మిలటరీ ఆర్డర్ లో " నీకింద ఓ  చివరి సైనికుడు ఉన్నంత కాలమూ  అతనికి దారి చూపాల్సిన భాద్యత నీదే అని చెప్పారు కదా ? . ఇప్పుడు చూస్తే ఓనోడా కింద ఎవరూ లేరు కదా ? అందువల్ల ఓనోడా  తన ఆత్మ ప్రభోదాన్ని అనుసరించి అడవుల్లో గోప్యంగా సంచరించ సాగాడు .అడవి వెల్లడించే రహస్యాలను మెదడులో పెట్టుకుంటున్నాడు .  కానీ శత్రువుకు లొంగి పోకూడదు అన్న సిద్ధంతాన్ని మాత్రం కొన  సాగిస్తూనే వున్నా  . జపాన్ రెండో దఫా  పంపిన సెర్చ్ టీం కు కూడా ఓనోడా ఆచూకే చిక్కలేదు .

"కోజుక" మృతి తరువాత ఓనోడా అదృష్టంలో మార్పు వచ్చింది అనుకోవాలి .
"కోజుక" మృతిసంఘటన నుండి స్ఫూర్తి పొందిన Norio Suzuki అనే జపాను విద్యార్థి 1974,తన కాలేజీ విద్యను మధ్యలోనే వదిలివేసి -అరణ్యాలను అన్వేశించి సంగతులు తెలుసుకునే పరిశోధకుడిగా గా మారాడు . ఈ నోరియా సుజుకి -- ఫిలిప్పిన్స్ , మలేషియా , సింగపూర్ , బర్మా , నేపాల్ , వంటి దేశాల అడవులను అన్వేషించి "పాండా "అనే వన్య ప్రాణిని - "యతి" అని మనవారు పిలిచే మనిషి వంటి జంతువు ను /ప్రాణిని కనుగొనాలని సంకల్పించాడు { యతి అనే ప్రాణి - హిమాలయపు మంచుకొండల్లో జీవిస్తూ మనిషి లా నడుస్తుంది. యతిని మంచు మనిషి అని కూడా పిలుస్తారు } { అసలు యతి అనే ఒక మంచు మనిషి వున్నాడు అని నోరియా సుజుకీ కి ఎలాతెలిసిందా ? అని కూడా ఆలోచిద్దాము .హిమాలయ ప్రాంతాలలో ప్రచారం లో వున్నా జానపద కథలలో మంచు మనిషి ప్రస్తాపన వున్నది . 1921, లో బ్రిటన్ కి చెందిన Lieutenant -Colonel చార్లెస్ హోవార్డ్ -బరీ అనే అయన మౌంట్ ఎవరెస్ట్ ను ఎక్కే ప్రయత్నంలో ఉండగా 21,000 ft (6,400 m) ఎత్తు న ఏర్పడిన మంచు పొరల మీద విచిత్రమైన పాదముద్రలు చూసాడు . వీరితో పాటుగా వున్న షేర్పా జాతి వాడు ఒకరు " అవి "kang-mi"అనే మంచు మనిషి పాదముద్రలు" అని చెప్పాడు. దీనిని బ్రిటిష్ అయన తన యాత్రా అనుభవాలలో రాసి పెట్టాడు . ఆ షేర్పా జాతి వాడు ఇంతకు ముందు అనేక సార్లు ఇలాంటి పాద ముద్రలు చూసి ఉండకపోతే - వాటిని చూసి దడవటమో , ఆశ్చర్య పడటమో , చేసి దానికి మొక్కే వాడే కానీ, వాటికి ఒక పేరు పెట్టి ఊరుకునే వాడు కాదని లాజిక్ ప్రకారం . హిమాలయాల్లో మంచు మనిషి తిరుగుతూ ఉన్నాడన్న నమ్మ కాలు బయలు దేరినాయి . }

ఇంతకు ముందు రెండు సెర్చ్ పార్టీలవారిని వరించని అదృష్టము ఈ నోరియా సుజుకీ ని వరించింది . ఇతడు 1974 లో ఫిలిప్పిన్స్ అడవుల్లో కేవలం నాలుగు రోజులు సంచరించిన తరువాత "హీరో ఓనోడా" ను కనుగొన్నాడు . {ఈ Norio Suzuki - గురించి కొంత -- ఇతడు తన అన్వేషించే తత్వాన్ని

వదులుకోక -"యతి" అని పిలవబడే మంచు మనిషి కోసం వెతుకుతూ హిమాలయాలలోని Dhaulagiri అనే ప్రాంతానికి కి వచ్చాడు . తాను "యతి" అనే మంచు మనిషి ని దూరం నుండి చూచాను అని ఇతడు July 1975, లో ప్రకటించాడు . ఇతడు ఓనోడా యొక్క ఆచూకీని కనిపెట్టిన మనిషి కాబట్టి ఇతని మాటలకు చాలా విలువ దొరికి ప్రపంచము అంతటా వున్నా వర్తా పత్రికలలో "యతి" అనే వాడు వున్నాడు అంటూ అనేక కధనాలు వచ్చాయి . అమెరికా లో ది బిగ్ ఫుట్ అనే - సినిమా కూడా వచ్చింది . Norio Suzuki "యతి" అన్వేషణలో గడుపుతూ హిమాలయాలలో నే ఉంటూ 1976, అక్కడి అమ్మాయిని పెళ్లాడాడు . యతి ని కనిపెట్టాలని హిమాలయాలలో నే తిరుగుతూ- అనుకోకుండా ఓ మంచు ప్రవాహం మధ్య చిక్కి నవంబర్ 1986 లో అక్కడే మరణించాడు }. { మన ఇండియన్ ఆర్మీ వారు 2019 లో తాము యతికి చెందినవి గా భావింపబడే రొండు పాదముద్రలను నేపాల్ లోని " మకాలు బేస్ క్యాంపు" వద్ద కనుగొని, వాటిని కొలత వేశామని చెప్పారు . ఆ పాద ముద్ర లు 32 అంగుళాల పొడవు 15 అంగుళాల వెడల్పుతో వున్నదని వారు చెప్పారు . అప్పటినుండి యతి అని మంచు మనిషి యొక్క మనుగడ ఒక ఆసక్తి కర విషయం గా మారింది . శాస్త్ర వేత్తలు యతి అనే విషయాన్నీ త్రోసి పుచ్చారు .}

ఇక కథలోకి వద్దాము --
సుజుకి జపాను వాడు. జపాను భాష మాట్లాడుతాడు . రాస్తాడు . పైగా స్టూడెంట్ .ఒక స్టూడెంట్ ని నమ్మక పోవటానికి ఏమి ఉంటుంది? . అందువల్ల ఓనోడా అతను చెప్పినది విని జపాను లొంగి పోయింది అన్న వార్తలో నిజమే వున్నదని తెలుసు కున్నాడు . అయితే "జపాను లొంగి పోయింది కాబట్టి నన్ను లొంగి పొమ్మని నాకు చెప్పవద్దు - " నీ పోరాటాన్ని తాత్కాలికంగా ఆపివేయు " అని నాకు నా మిలిటరీ నుండి ఆర్డర్ లు ఇప్పించు అని కోరాడు . ఓనోడా కి మొదటిలో ఆర్డర్లు ఇచ్చిన మిలట్రీ ఆఫీసర్ పేరు "యోషీయా తనిగుచి " ఇప్పుడు అతడు పుస్తకాల విక్రేత గా మారాడు . అయన సుజుకి వెంట లుబంగ్ ద్వీపానికి వచ్చి ఓనోడా ని కలిసాడు . కలిసి --జపాను ఇంపీరియల్ ఆర్మీ నిర్ణయం ప్రకారము - నీ బెటాలియన్ పోరాటం చేయటం చేయటం

విరమించింది . అందువలన నీవు నీడ్యూటీ చేయనక్కరలేదు " అనే ఆర్డర్ మార్చ్ 9, 1974 న చదివి వినిపించాడు . శిష్యుని వల్ల గురువుకు గొప్ప పేరు వచ్చినట్లు ఓనోడా వల్ల ఈ సైనిక అధికారికి అంతర్జాతీయ ఖ్యాతి వచ్చింది .

తన మేజర్ చెప్పిన ఆర్డర్లను కూడా ఓనోడా నమ్మ లేక పోయాడు . కాసేపు అయోమయపడి - తరువాత తల వాల్చేసాడు . " నా పోరాటం ఒక నిష్ప్రయోజనమైన మలుపు తీసుకొని ముగిసింది" అని విలపించాడు . అప్పుడు తన వద్దనున్న తుపాకీ లోని బుల్లెట్లను తొలగించి ఆ ఆయుధాన్ని తన అధికారికి అందచేశాడు . ఆపై తన మిలిటరీ బ్యాక్ ప్యాక్ ను భుజాలనుండి తొలగించాడు . తన సహచరుడు మరణించినపుడు అతని నుండి రికవరీ చేసిన ఆయుధాన్ని కూడా అప్పగించాడు . తనను నమ్మి తనతో పాటు అరణ్యాలలో గడిపిన మిత్రుల కోసం అని కొంత సేపు విలపించాడు . అప్పుడు కూడా ఓనోడా " యుద్ధము ముగిసి పోయిందే నిజము అయితే -- వారు నా మిత్రులను ఎందుకు చంపారు? " అని పదే పదే అడిగాడు .

తన అరణ్య వాసము లోఓనోడా మొత్తము 30 మంది ఫిలిప్పీన్ ప్రజలను చంపివేసినట్లు - 100 మందిని గాయ పరిచినట్లు అభియోగాలు నమోదు అయినాయి . ఈ లోపుగా ఫిలిప్పీన్స్ లో అమెరికా ప్రభుత్వమూ పోయి Ferdinand Marcos, ఫిలిప్పీన్స్ కి ప్రెసిడెంట్ అయినాడు , ఈ ప్రెసిడెంట్ ఓనాడకి క్షమా బిక్ష పెట్టి, ఓనోడాను అన్ని నేరాలనుండీ విడుదల చేసి జపానుకు తిప్పి పంపి వేసాడు .

ఓనోడా కి అరణ్య వాసము బాగా అలవాటు ఐనందున ఇతడు జపాను వచ్చినాక తన భార్యను వెంట తీసుకొని బ్రెజిల్ అడవుల్లోకి వెళ్లి అక్కడ కాపురం /నివాసం పెట్టాడు .అక్కడ పశు పోషకుడిగా జీవిస్తూ - ఎంతో ఉత్సాహము తో ఆ దేశపు పిల్లగాండ్లకు " అడవిలో ఆనందంగా జీవించటం ఎలా " అనే విషయం మీద ఓ స్కూల్ లాంటిది నడిపాడు . కానీ భార్య వత్తిడితో 1984 లో తిరిగి జపానుకు వచ్చి " ప్రకృతి తో సహజీవనం చేయటం ఎలా అనే విషయము మీద

" స్కూల్ నడిపి పిల్లలకు అటవీ శాస్త్ర విజ్ఞానాన్ని బోధించాడు . 1996, ఇతని భార్య ఐన (née Honoku) మరణించింది . ఆమె మరణ దుఃఖము నుండి కోలుకోవటానికి అని ఇతడు మరో సారి ఫిలిప్పీన్స్ కు వెళ్లి - అక్కడి వన్య ప్రాంతం లో వుండే స్కూల్ కి ఫది వేల అమెరికా డాలర్లు - భార్య పేరు మీద విరాళంగా ఇచ్చాడు . Thursday , January 16, 2014, న Hiroo Onoda తన 91 ఏటా మరణించాడు . ఇదంతా ఒక మామూలు మనిషి "జపాను లొంగి పోదు" అని ప్రపంచానికి ప్రకటించి నట్లు ఉందని ప్రజలు భావించటం తో ఇతను జపాన్ యొక్క రియల్ లైఫ్ హీరో గా మారి మరణించాడు.

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

నా చిన్నపుడు దొంగ పోలీసు అట ఆదివారము . దొంగలందర్నీ పట్టుకుని కట్టి వేయటం పోలీసు పని . ఇందులో దొంగను నేను అనుకోండి . పోలీసు కంట పడకుండా నా మిత్రులైన దొంగలను సమీపించి వారికికట్టి ఉన్న తాళ్లను కోసి వేసినట్లు నటన చేసి - పారిపో అని అరవాలి . నేను దొంగగా వున్నపుడు ఎంతో సేపు ఎవరి కంటా పడకుండా ఎంతో సేపు దాక్కునే వాడిని .ఆ దాక్కోవటం లో నా మిత్రులకు / నా వారికీ ఎదో చేయాలనే తపన ఉండేది . ఒంటరిగా ఎవరికంటా పడకుండా దాక్కోవటం లోనూ - ఇలా దాక్కున్న నా వాళ్ళ ఎదో గొప్ప పని అవుతుంది అనే ఆలోచన నాకు ఎంతో ఆనందం ఇచ్చేది . నేటి పిల్లలకు ఇలాంటి ఆనందాలను - దాని ద్వారా వచ్చే మానసిక వికాసాన్ని - వారు తల్లి తండ్రులు దూరం చేస్తూ వున్నారు .మనసును దాని వికాసాన్ని అనుసరించి జీవించటం గా ఈ కథను ఈ సింపుల్ గా అర్ధం చేసుకో వచ్చు



Korechika Anami "కోరుచిక  అనామి "



Image showing Japans surrender  to america



general Yamashita Tomoyuki



Above is **norio suzuki the explorer with onoda**



**Major Taniguchi**




**Onoda with his wife née Honoku**



my grand son **uma nikhil** nandan



My son varanasi satya sreekantha at a defence expo in bangalore




The writer varanasi uma sree rama krishna - himself at age 63-64